# అన్యాయం

(నాలుగు కథలు)



రచయిత:

శ్రీరసాగరం



పబ్లిషర్స్:

ప్రభాత్ పబ్లికేషన్స్,

(ప్రొప్రయిటర్: చందూరి నాగేశ్వరరావు)

పవరుపేట, ఏలూరు.

# వి ష య సూ చి క







# అన్యాయం

'మీరు వెళ్ళవద్దండీ!'

'పెంకిపట్టుపడ్తే ఎలాగ చెప్పు! స్థితిగతులు అర్థం చేసుకోవాలి.'

'వో, చేసుకొన్నాను. మీరు వెళ్ళడం నాకెంతమాత్రం యిష్టంలేదండీ.'

'ఇష్టంలేదంటే నీకు స్థితిగతులు అర్థంఅవలేదన్నమాట.'

'మీరెలా అన్నాసరే; వెళ్ళడం మాత్రం నాకు నచ్చదు.'

'నాయకుని ఆవేశపూరిత వాక్యాలు నాచెవుల్లో ఘోషిస్తున్నాయి; వెళ్ళక తప్పదు.'

'ఎం. ఏ. బి. యల్......లీడింగ్ వకీల్......లాఠీచార్జి......కారాగృహవాసం...వద్దండీ. మీరు వెళ్ళడానికి వీల్లేదు.'

'ఉత్సాహపరచడం లేనేలేదు; పయిగా నిరుత్సాహపరుస్తావేమిటి! శాంతిసమరంలోకి పోయి దెబ్బలాడుతాను.'

'అహాహా! శాంతి...సమరం...దెబ్బలాట...అవునండీ! ఎందుకా సమరం?'

‘ఎందుకా? అందుకే, నీకు ప్రస్తుత రాజకీయ పరిస్థితులు సరిగా తెలీవని నేనంటున్నాను. చూడు...ఇటుచూడు, సరళా...నా మొహంవంక చూడు...దాస్యశృంఖాల్లో తగులుకొన్న భారతజనని బంధాలు విప్పడానికి...’

‘భ్రమ.’

‘భ్రమా? భ్రమా? కాదు; దిక్కులేక మొర్రో అని గోలపెడుతున్న మన కన్నతల్లి కష్టాలు నాశనం చెయ్యడానికి కంకణం కట్టుకొన్న యోధుల్లో నేనొకణ్ని. ఆ చల్లటి తల్లి తిప్పలు బాపలేనూ?’

సరళ తన రెండు చేతులూ అతనిభుజాలకి పెనవేసింది. ‘అయ్యో! వినరూ? మీకుపూర్తిగా మతిపోయిందండీ! నెలకి అయిదారు వందలరూపాయిలు వచ్చే ప్రాక్టీస్ మానుకుంటారా?’

‘ప్రాక్టీస్! ప్రాక్టీస్! చూడు, ఎవరో అబ్బి వీధిలో ‘కాస్త అన్నంపెట్టండమ్మా,’ అని అరుస్తున్నాడు. అలా విలపించే దరిద్రులందరికీ ప్రవాధి చూపిస్తాను.’

‘లక్ష్మమ్మతో (వంటలక్క) ఆ అబ్బికి కాస్త అన్నం పడేసి రమ్మనమని చెప్పనా?’

‘సరళా, ఒకడికి పెడ్తాం, ఇద్దరికి, ముగ్గురికి, పదిమందికి, రోజూ అంతకంటె ఎక్కువమందికి మనమూ పెట్టలేం గదా! ఈదేశంలో, వేదఘోషలు వెలిగి పోతున్న దరిద్ర దేశంలో, అన్నమోరామచంద్రా, అని అల్లలలాడేకోట్ల జనాభాకి ఎవరు గంజిపోస్తారు?’

‘మీ బుర్ర అంతా పాడుచేసుకోక హాయిగా బజ్జోండి. ప్రపంచకంలో వాళ్ళందరి కష్టాలూ నెత్తిని పెట్టుకుంటే ఏవ్యక్తీబతకడందుర్లభం. ప్రతిదేశంలోనూదరిద్రులూవుంటారు, భాగ్యవంతులూ వుంటారు. వాళ్లసంఖ్య దేశకాల పరిస్థితుల మీద ఆధారపడి వుంటుంది. దానికి మనమేంచేస్తాం! ఊఁ, ఇక పడుకోండి. రేపు పొద్దున్న మళ్ళీ మొదలెట్టవచ్చును లెండి, ఆలోచన.’

‘నిద్రా? భారతమాత నిద్రపోవద్దంటోంది. అఘోరమైన స్థితిలోవున్న తన్ను రక్షించమని కళ్ళనీళ్లు బొటబొట రాలుస్తోంది.’

‘ఊహూ! అది కవితోన్మాదం వంటిది. ఒక పిచ్చిలో, పిచ్చిలో కాదు, అఖాతంలో, పడిపోయి మీ తెలివితేటలు దగ్ధం చేసుకుంటున్నారు.’

‘దగ్ధం చేసుకోవడం లేదు. రేపు సాయంకాలమే ప్రయాణం.’

'అవుతే మీా మనస్సు మార్చుకోరూ ?'

'మార్పు అసంభవం.'

'నిజంగా ?'

'భగవంతుని సాక్షిగా.'

'అబ్బబ్బ! (భుజాలు తడుముతూ) ఈభుజాలు ఆకరకు లాటీలకి వప్పజెప్తారా? మూర్ఖులై పోతున్నారండీ...—మనం కొత్తగా తెప్పించిన రామచిలుక కొద్దిగా కబుర్లు చెప్తోం దండోయ్ !'

'రామచిలుక.....రామదాసు.'

'రామదాసేమిటి ?'

'రామదాసు ఎన్నో సంవత్సరాలు జైలులో వుండ లేదూ ?'

'ఊఁ, వున్నాడు.'

'అలాగే నేనూ వుంటాను.'

'వుండి ?'

'మళ్ళీ ! మొదటికి వచ్చావ్ ! జనసికి విముక్తి కలగ జెయ్యడానికి.'

'మనం ఆ కొత్తకారు కొని సరిగ్గా రెండు నెలలయినా అవలేదు. మీారు జైలుకిపోతే ఆ కారు ఎవరు వాడుతారో చెప్పండి ?'

'ఏమో ?'

'మీకు మొన్ననేగదా యిరవైఅయిదూ వెళ్ళినై ; నా కింకా యిరవై పూర్తిఅయినా కాలేదు...... మొన్న మధ్యనే, మీరేదో వూరువెళ్ళి, నాలుగు రోజులవరకూ రాలేదు. రాత్రివేళండీ, చెప్తే నమ్ముతారో నమ్మరో పక్కమీద పడుకొని, అటూ యిటూ, యిటూ అటూ, అదేపనిగా దొర్లేదాన్ని. సిగ్గేస్తుంది చెప్పేందుకు. ఏమూడో, నాలుగో అవుతే కాని నిద్రపట్టేదికాదు. ఏ తొమ్మిదింటికో లేచి, డ్రసింగ్ టేబుల్ ముందు కూచుని నాలో నేనే నవ్వు కొనేదాన్ని......మీరు క్లబ్బునుంచి టైముకి రాకపోతే ఏమీతోచక వెంకణ్ణి, (నౌకరు) లక్ష్మమ్మనీ అకారణంగా చడామడా తిట్టూవుండే దాన్ని—మీకూ తెలుసునుకదా— అలాంటినన్ను, భార్యని, గృహిణిని (అతని మొహంలోకి చూస్తూ) అర్ధాంగిని, కష్ట సుఖాలు సరిసమానంగా తక్కెడతో తూచినట్లు పంచుకుంటానని పదమంది పురోహితులదగ్గిరా ప్రమాణంచేసి మాంగల్యం కట్టిన నన్ను వదలిపెట్టి, ఆ అనర్ధదాయకమయిన సమరానికి పోతారా? ఏమండోయ్—మీకూ తెలీనివిషయంకాదు, వొకంట మీహిందూసతి కన్నీరు కారుస్తూ వుండగా, లోకరక్షణార్ధం మీ రెంతవరకూ సహాయపడ గలరూ ? ఇక్కడ సతి కన్నీరు కారుస్తూవుండగా అక్కడ మానకన్నీరు మీ రెంతవరకూ మాపగలరు ? వద్దు, వద్దు !

చడిపోతున్నారు. నామాట వినండి. మీలో ప్రభవించిన ప్రద్రేకం మీఅంతరాత్మని నిర్మూలించడం చేతకాని, ఏన్యాయ శీలుడు తనప్రేమ పుష్పాన్ని వదలిపెట్టుకుంటాడు ? శాసన ధిక్కారం దరిద్రనిర్మూలానికి హేతువా? బావుందికాదూ? (అతనివళ్ళోకి పూర్తిగావరిగి చెక్కిళ్ళు ముద్దాడుతూ) మానెయ్యరూ ?'

'అబలవి. బేలవి. నీకు ప్రపంచమంతా భయోత్పాదం గానూ- అగమ్య గోచరంగానూ అగుపిస్తుంది. మనదేశం భీభత్సమైన కరువులో మునిగివుంది.'

‹నేను అబలని, బేలని, నాకేమి తెలీదు. తూర్పుపడమరలు తెలీవు. ఆఖరుకికొలంబస్ పదిహేనోశతాబ్దంలోఅమెరికా కనిపెట్టాడనే విషయంకూడా తెలీదు. వప్పుకుంటాను. సర్వమూ తెలిసినవారు. ప్రద్రేకంలో ప్రయత్నించిన కార్యం సానుకూల మయేందుకు అంతరాత్మని చంపుకుంటూ, సౌఖ్యాల్నిచీల్చి చెండాడే యోధాను యోధులు మీరు కారూ !"

'...................'

"చిట్ట చివరినారి అడుగుతున్నా. మానేస్తారా, సంతోషం. మానరూ, యిదే మన చివరిరాత్రి."

'దేశసేవే ముఖ్యం. ఒకటే హోరుగా వినిపిస్తున్న జనని రోదన తప్ప వేరు విషయాలు ఈ చెవులకి వినిపించవ్ !'

'ఊహుఁ... అవును. ఎందుకు వినిపిస్తాయి!'

నిస్పృహతో ఓటమిని అంగీకరించే వేడినిట్టూర్పు విడుస్తూ, సరళ పక్కమీదికి వరిగి, కళ్లు మూసుకుంది.

*　　*　　*

రెండేళ్ళ ఖైదూ, రెండువేల రూపాయిల జరిమానా. అదృష్టమా అంటూ లాటీదెబ్బలు తప్పినై.

కుమారస్వామి జైలుకి వెళ్తూ, బారిస్టర్ సుందరంతో తనయింటి వ్యవహారాలు కొద్దిగా చూస్తూ వుండమనిఅన్నాడు గాని దేవసేవకునికీ సంసారగోష్ఠికీ ఆమడదూరం కాదూ !

తన ప్రార్థనలూ, జాలిపలుకులూ పెడచెవిని పెట్టి తన పంతమూ తనదేశసేవా ప్రధానము లన్నట్లుగా జైలుకిపోయిన కుమారస్వామిమీాద సరళకి కించజనించింది. గర్భిణి అయిన తన్ను నిస్సహాయినిగా చేసిపోయినందుకు విసుక్కుంది. కాని, ఆ హిందూలలావు రోజులు లెక్కపెడుతూ నాథుని మరలిక కోసం ఎదురు చూసేది "ఇదే మన చిట్టచివరి కౌగలీ, చిట్ట చివరి ముద్దూ" అని ఆమె గంభీరమైన భావంతో అన్నపల్కులకి, గర్భాన్ని తడుముకుంటూ, "నేను జైలునుంచి తిరిగి వచ్చే

టప్పటికి బేబీని చంకలో పెట్టుకొని, చిన్నారి నవ్వుల్తో నన్ను ఆహ్వానించేందుకు రావూ ?" అని కుమారస్వామి చెప్పిన వాక్యాలు ఆమె హృదయ నాళాల్లో అతుక్కు పోయినై. అత్యంత సుకుమారమయిన అతని హృదయం శిలాభాతి అయి పోయిందే అని ఆమె విచారించింది.

నెల అయినా సరిగ్గాగడవలేదు. ఆమెకి జబ్బుచేసింది. ఆపైన ఎబార్షన్. సొమ్ముగురించిన కష్టాలు వచ్చినై. కొత్త కారు అమ్మి వెయ్యవలసి వచ్చింది. సంసార బెడద అంతా యజమానురాలి నెత్తిని పడింది. బారిస్టర్ సుందరం అత్యంత ఆప్తునిలా ఆదుకొన్నాడు. పాపం ! రోజూ క్లబ్బునుంచి యింటికి పోయేటప్పుడు పనిగట్టుకు వచ్చి పదినిముషాలు కూచుని క్షేమసమాచారం తెలుసుకొని వెళ్తూవుండేవాడు.

సరళ ఒకరోజున మాటవరుసనిఅంది: రేపయినా వంట లక్కకి రెండునెలల జీతమూ యివ్వాలని. ఇంటికి వెళ్ళి వెళ్ళ గానే, రెండువందల రూపాయిల నోట్లు కవర్లోపెట్టి, తనగుమా స్తాచేతికిచ్చి పంపాడు. ఆమె నిరాకరిద్దామనుకొంది. ఆరో జున గొప్ప వంశంలో పుట్టిన తనకి యిలాటి అవస్థ కలుగ చేసాడు కదా అని భర్తని తన మనస్సులో తిట్టుకొంది. శాస నోల్లంఘనమే దేశస్వాతంత్ర్యానికి మూలసూత్రమన్న భర్త మాటలు కనుదుకొంది: ఆమె తలపోసింది. "పురుషుడు స్వార్థ

పరుడు. తన కోర్కెలే అతనికి ప్రధానం. స్త్రీని పురుషుడు సంతోషం గూర్చే ఒక పరికరంలా భావిస్తాడు. ఆస్త్రీసాధక బాధకాలూ, కష్టసుఖాలూ, లాభనష్టాలూ, స్వార్థపరుడయిన పురుషుడు గణించడు." అతను చిన్నబుచ్చుకుంటాడనే అభిప్రాయంతో, పుచ్చుకోక తప్పదని, ఒక కంట తన అవస్తకి కన్నీళ్ళు రాలుస్తూ రెండువందలూ పుచ్చుకొంది.

కుమారస్వామి జైలుకివెళ్ళి, మూడునెలలు దాటిన తర్వాత, ఒకరోజు సాయంకాలం డిప్టీకలెక్టరుగారి కూతురు—కమల—సరళని, "ఏమే నీఫ్రెండు వచ్చేవేళయింది కాబోలు!" అని ఓరగంట చూస్తూ పరిహాసం చేసేటప్పటికి, సరళ తోక తొక్కిన తాచులా మండిపడి, కోపం అణగదొక్కుకొని, "ఏడ్చావులే!" అని కమలతో అంటూ తన ఖర్మాన్ని తిట్టుకొంది. యువతీ యువకుల పరస్పర బాంధవ్యం ఎప్పుడూ ప్రణయాంకురమే అన్నట్లుగా లోకం అనుకుంటుంది.

* * *

ఇంకో నెలరోజులు గడిచినతర్వాత :

'గుడ్ ఈవినింగ్, సరళా.'

'వెరీగుడ్ ఈవినింగ్.'

'ఎందుకు కబురుపంపించావ్, సరళా!'

'నేను రేపు పుట్టింటికి వెళ్ళామని అనుకుంటున్నా, నిన్నా మొన్నా కూడా రాలేదు; ఇవ్వాళకూడా రావడమనేది వుండదేమో అని కబురంపించాను.'

'నిన్నేమో.........'

'కారణాలు చెప్పనవసరం లేదు.'

'మీవూరు వెళ్ళడం ఎందుకు?'

'ఏమీలేదు. నాలుగైదు రోజుల్లో మా చెల్లెలి పెళ్ళి. రేపు మంచిరోజుట. అంచేత రేపే తప్పకుండా బయలుదేరి రమ్మనమని మా అమ్మ మరీమరీ వ్రాసింది.'

'తప్పకుండా వెళ్ళాలన్నమాట.'

'ఊ...' ఈపూటకిమాయింట్లోభోంచెయ్యకూడదూ!

'ఎందుకులే...ఇంటికి పోతాను.'

'భోంచెయ్యాలి...తప్పదు.'

లక్ష్మమ్మ పరిపరి విధాల మనస్సులో తలపోస్తూ ఆ జంటకి ఆకుల్లో అన్నం వడ్డించింది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ అన్నంతిన్నారు. వారికబుర్లు లక్ష్మమ్మకి అగమ్య గోచరంగా వున్నాయి.

భోంచేస్తూ సరళ అడిగింది: రాజకీయ ఖైదీల్ని వదిలి పెడ్తారనే వదంతులు ఎంతవరకూనిజమని. శరత్కాలమేఘాలు

చూడడంవల్ల చాతక పక్షికి కల్గే భ్రాంతిలాటిదని పొయిట్రి వెల్గించాడు, బారిస్టర్ సుందరం.

భోజనంఅయింది. ఇద్దరూ సావిట్లో కుర్చీలమీద కూచున్నారు. ఇద్దరిమధ్యనూ టీపాయివుంది. చెరో వైపునా కుర్చీ. టీపాయిమీద రాధాకృష్ణులు ముద్దులాడుతున్న టేబుల్ క్లాత్. దానిమీద పాందాని. సరళ వెంకడూ అని కేకవేసింది. వెంకడి చేతికి వో పావలా యిచ్చి గోల్డ్ ఫ్లేక్ పాకెట్ ఒకటి తీసుకురమ్మంది. పాందానిలోవున్న తమల పాకులు ఇద్దరూ నమలడం మొదలెట్టారు.

ముందరివాకిట్లోని పూలచెట్లు ఆమధ్యాని ఎప్పుడూ లేనంతపరిమళం వెదజల్లుతున్నాయి. నైట్ క్వీన్ ఎంతో కమ్మని వాసనేస్తోంది. ఆ వాసన ఆఘ్రాణిస్తున్న కొద్దీ ఆమె కేమిటో కమ్మని వుద్దేశాలు కలిగినై. అతనే జైలుకిపోక అక్కడవుంటే, ఈ కమ్మటిరోజున, అష్టమచంద్రుడ్ని ఆప్యా యంతో వీక్షిస్తూ, కష్టాలు మర్చిపోతూ, ఎంత ఆనందించే వాళ్ళమో గదా అని భావించింది. పాపం! ఆ జైలులో, చీకటికొట్లో, ఏం బాధపడుతున్నారో గదా అని ఒకజాలి, గగనసీమని గడగడలాడించే గంభీర ఘనాఘనాళార్భటుల్లోని మెరపు మాదిరి మెరిసింది. మరుక్షణమే, "ఏం చేసుకొన్న పెళ్ళాం కంటె దేశం ఎక్కువయిందా! బతుకుతానో, చస్తానో అనే

విషయం ఆవగింజంతయినా ఆలోచించకుండా వుద్రేకంలో వెళ్లినందుకు ఆ మాత్రం శిక్షఅయినా అనుభవించ వలసిందే!" అనే విప్లవ భావం ఆమె నవనీత హృదయంలో రేకెత్తింది.

"ఇదిగోనండీ, సిగరెట్టు పెట్టె," అని నౌకరు అన్న మాటలకి ఆమె కంగారు పడింది. సుందరంతో, 'సిగరెట్టు కాల్చు,' అని అంది. సుందరం సిగరెట్టు ముట్టించాడు.

'ఏమిటా ఆలోచన ?' అని సుందరం ప్రశ్నించాడు.

'ఏమీ లేదు.'

'చెప్పవ్ !'

'ఏమీలేదన లేదూ !'

'నాకు చెప్పవులే ! మీవూరునుంచి మళ్ళీ రావడం ఎప్పుడు ?'

'బహుశా నెలరోజులవుతుంది'

'ముప్ఫయిదినాలే ?'

'ఊఁ...సుమారు...'

'ఈముప్ఫయి రోజుల్లోనూ, సరళా, నేనునీకు ఒక్క-మారయినా జ్ఞప్తికి వస్తానా ?'

'ఏమో !'

అన్యాయం.

'............'

'మిస్టర్ సుందరం! నువ్వింతవరకూ ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?'

'నువ్వ్వేసావ్, ఈప్రశ్న! ఎన్నాళ్ళనుంచీ ఈవిషయం అడుగుదామని అనుకుంటున్నావేమిటి, సరళా?'

'చాలారోజుల్నుంచి అడుగుదామని వుండేది కాని నువ్వెలా అభిప్రాయ పడతావో అని అడగలేదు.'

'సరళా, సరి అయిన ప్రశ్న వేసావ్! ఏం సమాధానం చెప్పమంటావ్.'

'బావుందికాదూ! ఎందుకు పెళ్ళిచేసుకోలేదని నేను నిన్ను అడగడమూ, ఏం సమాధానం చెప్పమని నువ్వు నన్ను అడగడమూ బలే చోద్యంగా వుంది.'

'సరళా, పెళ్ళి, అనే విడదీయడానికి వీలుగాని ముడి, వూహామాత్రమైన బంధం స్త్రీ పురుషులు ఒకర్ని యింకోరు మోసగించుకొనేందుకు పన్నిన పన్నాగం.'

"అలాగా?"

"నేటి హిందూదేశం యింతటి దరిద్రమయిన స్తితిలో వుండడానికి ప్రస్తుత హిందూ వివాహ విధానంకూడా ముఖ్య కారణాల్లో ఒకటి."

"ఊహుఁ !"

"ఏం, అలా ఎగతాళి చేస్తున్నావ్"

"మన దేశంకూడా రష్యాలా తయారవాలంటావు. రోజుకో పెళ్లిచొప్పున చేసుకోవాలంటావ్ ?"

"ఏమిటి, సరళా !" అని తీవ్రమైన చూపులు ఆమె మందహాస వదనారవిందంపై ప్రసరింప జేసాడు. అప్రయత్నంగా చిరునవ్వొకటి ఆమె పెదవులమీద నాట్యమాడింది.

ఆమె ఏమిటో చెప్పబోతూవుండగా అడ్డుతగిలి: "కాని, సరళా, స్త్రీసహచర్యం లేనిజీవితం వాసనలేని కాగితపు పువ్వులాటిది సుమా !"

"అహహ ! పురుషునికి పెళ్లిమాత్రం అక్కరలేదు. స్త్రీమాత్రం కావాలి. "లా" అంటే యిలాగే వుంటుంది కాదూ ! బారిస్టర్ !" అని అంటూ సరళ ఫక్కున నవ్వింది.

"సరళా, ఈ గొడవంతా ఎందుకుకాని, నేనొకటి చెప్తాను ; నీకు కోపంరాదుకదా !"

"చెప్పు."

"సరళా, నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

"నాకు తెలుసు."

అతనికి ఆ పైన ఏమనాలో తెలీలేదు. నిర్ఘాంతపోయి బారిస్టర్ సుందరం తెల్లమొహంవేశాడు. ఆఖరుకి, కోర్టులో కూడా ఎప్పుడూ అంత డంగయిపోలేదు.

"సరళా, కుమారస్వామి నిన్నింక సుఖపెట్టలేడు."

"ఆఁ...అంటే...అర్థం?"

"అతనూ...దేశమూ;...అతని పిచ్చిగోడవా? పుస్తె కట్టాడు కనక, నీ సౌఖ్యాలు చంపుకొని, అతనికే యావజ్జీవం భార్యఅయి వుండడం తగదు."

"అలాగా?"

"పోదాం, రా. నిర్భయంగానూ నిశ్చింతగానూ కాలం గడుపుదాం. నువ్వు నన్ను సౌఖ్యపెట్టగలవు, నేను నిన్ను సౌఖ్య పెడ్తాను."

"............"

"నీచంకాదు, వ్యభిచారంకాదు. బలాత్కారం కాదు. నన్ను ప్రేమించు. సుఖపడ్దాం, రా," అని అంటూ కోర్టులో వాదించినట్లు నుంచుని వాదిస్తూ, రెండు చేతులూ చాపాడు.

"మతేమన్నపోయిందా! వచ్చేటప్పుడు రిఫ్రెష్‌మెంటు రూముకి పోయిరాలేదుకదా." అని అంటూ సరళ నవ్వడం మొదలెట్టింది.

ఒక నిముషంపాటు, పిచ్చివాణ్ని చూస్తున్నట్లు అతని వంక చూసి, నవ్వింది.

అతను కుర్చీలోనుంచి లేచినుంచున్నాడు. ఆమె, "వెళ్తున్నావా !" అని ప్రశ్నించింది.

"సరళా, నన్ను ప్రేమించవ్ !" అని ప్రాధేయపడ్తూ అడిగాడు, బారిస్టర్ సుందరం.

ఆమె చాలా తేలికగా, "వూరుకో ఎవరైనా వింటే నవ్విపోతారు. నీకేదో పిచ్చెత్తుతోంది కాబోలు. ఇంటికిపోయి హాయిగా నిద్రపో. రేపు పన్నెండుగంటల బండికి వెళ్తాను. నాకు సెండ్ ఆఫ్ (Send off) యిచ్చేందుకు స్టేషనుకిమాత్రం వో గంట ముందుగా వస్తావు కాదూ !" అని వో చిన్న లెక్చ రిచ్చింది.

"వెళ్తున్నా," అని అన్నాడు.

గుమ్మందాకా వెళ్లాడు.

అమాంత్రం ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు ఆమె, "అన్నట్లు మిస్టర్ సుందరం, రేపు కోర్టుకి వెళ్ళవలసిన పనివుందా !"

"ఏం ?" అని బారిస్టర్ ప్రశ్న.

"రేపు పదకొండింటికి నీ కారు పంపించేందుకు వీలు వుంటుందేమో అని !"

అతను నివ్వెరబోయాడు.

"స...ర...ళా !" అని అన్నాడు.

ఆమె చెయ్యి ఆమెకి తెలీకుండానే "ఇటురా" అన్నట్టు అతనికి సంజ్ఞచేసింది. అతను వెనక్కి తిరిగి వచ్చాడు.

కుర్చీలో ఆమె కూచుంది. టీపాయిమీద చేతులు ఆన్చి అతను నుంచున్నాడు. ఆమె తలవంచుకొంది.

"సరళా !"అని అతనన్నాడు.

ఆమె తలపైకెత్తి దీనంగా అతని మొహంలోకి చూసింది. అతను జాలిగొలిపే ఆమె మొహాన్ని అమాంత్రం ముద్దెట్టుకొన్నాడు. ఆమె ఏమీ మాట్లాడలేక పోయింది.

మళ్ళీ అతను : "సరళా !"

జీరగొంతుతో ఆమె : "అన్యాయం."

---

# పట్టభద్రుడు.

అతను పట్టభద్రుడు. అంటే కష్టపడి బి. ఏ. డిగ్రీ సంపాయించాడు. ఇంటరుమీడియేటు పరీక్షలో విశ్వవిద్యాలయాని కంతకూ ఫస్టుమార్కు వచ్చింది. బి. ఏ. పరీక్షలో కూడ అంతే. రెండు తఫాలూ అతని ఫొటో పత్రికలు ప్రచురించినై.

అనేకులు అతను అతిమేధావి అన్నారు. పట్టిరుబ్బుడు గాదుఅన్నారు. కొంతమంది. గాంధీతర్వాత గాంధీఅంతవాడో, నెహ్రూ తర్వాతనెహ్రూఅంతవాడో అవుతాడన్నారు, శ్రేయో భిలాషులు. ఏ ప్రెసిడెంట్ రూజ్‌వెల్టులాటి వాడో అయే పాటి తెలివితేటలు మన వాడిలో లేనే లేవా అనుకొన్నారు, కొందరు లెక్చరర్లు. హిట్లర్ ముస్సోలినీలని వారితోడి విద్యార్థులు అంత దోర్దండ నాయకులవుతారనుకొన్నారా అని శంకించడం మొదలెట్టింది, అతనిమేలుగోరే విద్యార్థి బృందం.

ఏది ఎలా వున్నా, అతనంటే ద్వేషంలేని ప్రతివ్యక్తీ, అతను భావి భారతదేశాన్ని వుద్ధరించగల్గే ధీరోత్తములలో ఒకడనో, లేక, అగ్రస్థానాన్ని అలంకరిస్తాడనో, భ్రమించాడు.

అతనిపేరు ఆనందం. నిత్య జీవనంలో విచారం.

ఆనందం పట్టభద్రుడయే వరకూ శాస్త్రిగారింట్లో వో మూలని తన సామాన్లు పెట్టుకొని, వారాలు చేసుకుంటూ వుండే వాడు. శాస్త్రిగారికి అరవైయేళ్ళు నిండాయి; ఆయన జీవితం వేదాంత మార్గాన్ని పడింది. ఆనందం బి. ఏ. పరీక్షకి వెళ్ళిన వేసవి కాలంలోనే శాస్త్రిగారు కాశీకిపోయి జీవిత శేషం ఆ పవిత్ర గంగాజలసన్నిధిని గడుపుదామనుకొన్నారు. ప్రయాణానికి సామగ్రి అంతా సరిచేసుకొనే లోపునే యముడు వారంటు జారీ చేసాడు.

ఆనందం గర్భ దరిద్రుడు. మాతాపిత శూన్యుడు. బంధుగులు బహు కొద్దిమంది. దరిద్రునితో బంధుగులకేం పని? ఆనందానికి ఆప్తుడు శాస్త్రిగారు. ఆయనే ఆనందం వృద్ధికి పాటు బడ్డాడు. ఎం. ఎ. కూడా చెప్పిద్దామని కుతూహల పడ్డాడు. అలాటి ఉదారచిత్తుడు పరమపదించాడు. ఆనందం నిరాధారపక్షి అయాడు. అతనికి ఆధారం భర్తృహరి చెప్పిన పద్యం ఒక్కటే!

"విద్యనిగూఢ గుప్తమగు
విత్తము రూపము పురుషాళికిన్
విద్య యశస్సు భోగకరి
విద్య గురుండు విదేశ బంధుడున్

విద్య విశిష్టదైవతము
విద్యకుసాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము
విద్య నెరుంగని వాడు మర్త్యుడే."

ఆనందం హితులంతా శాస్త్రిగారు చనిపోయేటప్పుడు ఆ దరిద్రనారాయణునికి కాస్తో కూస్తో ముట్ట చెప్తాడనుకొన్నారు. ఆయన ఆకాలమరణం వల్లనో, మరింకే కారణం వల్లనో, అలాటిది ఏమీ జరగలేదు.

శాస్త్రిగారి పెద్దకొడుకు. "ఆనందం, నువ్వు మాయింట్లో చాలా కాలం నుంచి వుంటున్నావు. మా నాన్నగారు నిన్ను పట్టభద్రుడ్ని చేసారు. ఇదిగో, ఈ వందరూపాయిలు తీసుకో. ఎక్కడైనా ఉద్యోగం సంపాయించుకో. అప్పుడప్పుడూ ఉత్తరం ముక్క మాత్రం వ్రాస్తూవుండు," అని అంటూ ఆనందాన్ని యింట్లో నుంచి సాగనంపాడు.

అంత కాలం పెరిగిన ఆ యిల్లు వదలి పెట్టి పోతున్నప్పుడు ఆనందం నేత్రద్వయం అశ్రుజలపూర్ణ మయింది. కాని ఏడుపు మాత్రం రాలేదు. ఆనందం ఈ వికటవికృత విషాద ప్రపంచంలో ప్రథమ పాదం పెట్టాడు.

*   *   *

తాలూకా బోర్డులూ, జిల్లాబోర్డులూ, అన్నీ కలియ వెతికాడు. ఎందరినో ఆశ్రయించాడు. ఇంతకిపూర్వం తన స్కాలర్‌షిప్ గురించి సిఫార్సు చేసినప్లీడర్లని గుమాస్తాగిరీ అయినా యిప్పించమని ప్రాధేయపడ్డాడు.

నెల రోజులు పోయిన తర్వాత చూస్తానన్నాడు, ఒకాయన.

సర్వీస్ కమీషన్ పరీక్ష పాసవ కూడదా, అని యింకో ఆయన సలహా.

ఈ రోజుల్లో ఏం వుద్యోగాలన్నట్లు హేళనగా మాట్లాడాడు, పించనీ పుచ్చుకొంటున్నవో గవర్నమెంటు వుద్యోగి.

ఆనందం ఒకనాడు ఆ వూళ్లో వున్న పెద్ద షావుకారు దగ్గిరికిపోయి, ఏదైనా వుద్యోగం యిప్పించమని ప్రాధేయ పడ్డాడు.

"నీకు ఏం వచ్చునయ్యా!" అని ప్రశ్నించాడు, బొజ్జని నవరించుకుంటూ ఆ కోమటి.

"నేను పట్టభద్రుణ్ని."

"అంటే ?"

"బి. ఏ. పాసయ్యాను."

"అబ్బో ! బి. ఏ. లూ మాకెందుకయ్యా బాబూ!"

"ఏ చిన్న వుద్యోగం అయినా సరే, బాబూ. నెలకి ఏదో పది రూపాయలు ముట్ట చెప్పండి. మీరు దానధర్మ పరాయణులు."

"దానికేం గాని, నీకేం వచ్చునంట ?"

"బి. ఏ. పాసయ్యానని చెప్పడం లేదు, బాబూ!"

"ఈ బాపనయ్యకి మన దగ్గిర నౌకరీ కావాలంట. బి. ఏ. పాసయ్యాడట. చిట్టా వ్రాసేందుకు పెట్టావేమిటిరా, నారాయణా," అని పెద్ద కొడుకుని కేకేసి చెప్పాడు.

"మనకి బి. ఏ. లెందుకు ?" అని ఒక ముక్కతో తేల్చేసాడు, కోమటి పెద్దకొడుకు.

"మా వాడు వద్దంటున్నాడు. నేనేంచేసేది !" అని అంటూ సిందని కొడుకు పాలుచేసి, తను తల తుడుచుకొన్నాడు షాహుకారు. బుర్ర గోక్కుంటూ యింటికి మరలాడు, ఆనందం.

ఆనందానికి ప్రతి చోటా యిలాగే అయేది. ఆ పట్ట భద్రుడు జీవనోపాధి తెలుసుకోలేక బెంబేలు పడిపోయాడు.

"సిటీలో అవుతే ఏదైనా వుద్యోగం సులభంగా దొరుకుతుందేమోరా !" అని నలుగురైదుగురు స్నేహితులు ఆనందంతో అన్నారు. మద్రాసుపొమ్మని సలహా యిచ్చారు.

ఆనందం శాస్త్రిగారి యిల్లు వదిలిపెట్టి అప్పుడే రెండు నెలలవ వచ్చింది. శాస్త్రి గారి పెద్ద కొడుకిచ్చిన నూరురూపాయిల్లోనూ ఆనందం దగ్గిర యింకా మిగిలి వున్నవి, డెబ్బయి రూపాయిలే! ఈ నాలుగు డబ్బులుకూడా అయిపోతే అతను మలమల మాడవలసిందే! దీపం ఆరిపోయే లోపునే పనంతా చక్కపెట్టుకోవాలి కదా!

ఉదరపోషణార్థం ఉద్యోగం; ఆ ఉద్యోగం కోసం అతని తిప్పలు.

షేక్సుపియర్ రచనా నైపుణి అనన్య సామాన్యమని పొగిడే వాడు, మిల్టన్ పదగుంఫన అద్వితీయ మనేవాడు. కాళిదాసు రచించిన శాకుంతల నాటకం లాటిది యింతవరకూ ఏ భాషలోనూ వెలువడలేదని అతని అభిప్రాయం. అన్నీ నిజమే! కాదని ఎవరంటారు? కాని అతను బాధ పడుతున్న దేమిటి? ఇన్నేళ్ళు కాలేజిలో చదివి, యిన్ని గ్రంధరాజాల్ని పఠించి, కాలేజీకే కాకుండా విశ్వవిద్యాలయాని కంతకూ ప్రజ్ఞావంతుడ్ని అనే అఖండఖ్యాతి గాంచి, ఒకసామాన్యమైన నౌకరీ సంపాయించడానికి అసమర్థుడ్ని అయ్యాను కదా అని!

ఎలాగయితేనేం, మద్రాసుకి ఒక శుభముహూర్తాన పయనం కట్టాడు.

* * *

మూరు మార్కెట్టుకి ఎదురుగా వున్న రామస్వామి మొదలియారు సత్రంలో బస చేసాడు. జనసమర్ధంతోనూ, కార్లతోనూ, బస్సులతోనూ, కిటకిటలాడే పురవీథుల్ని గాంచి అతని మనస్సు కొంత స్తిమిత పడింది. అంత జనాభా, సుమారు ఆరు లక్షల జనాభా గల ఆ పట్నంలో తనలాటి నిరుపేదకి, దిక్కుమాలిన పట్టభద్రుడికి ఉదరపోషణ నిమిత్తం ఏ చిన్న ఉద్యోగమైనా దొరక్క పోతుందా అని తలపోసాడు. ఇన్ని లక్షల మందిలో తన్ను, విశ్వవిద్యాలయాని కంతకూ వజ్రం అనిపించుకొన్న తన్ను, నౌకరిలో చేర్చుకొనే ధర్మదాత ఒకడైనా వుండడా అని' అతని భ్రమ.

మొదటిరోజు పురవైభవాల్ని, వింతల్ని చూస్తూ కాలం గడిపాడు. విశాలమైన రోడ్లూ, మేలైన సౌధాలూ, గుంపులు గుంపులుగా పోయే జనసమర్థమూ చూసి ఆనందించాడు. బీదిలో కూచుని ఎలాటి వ్యక్తిఅయినా తనకష్టాల్ని మర్చిపోగలడను కొన్నాడు. తనకి వుద్యోగం దొరకిన తర్వాత రోజూ బీదికి తప్పకుండా పోవాలని తీర్మానించు కొన్నాడు.

మర్నాటి వుదయం అతను గత సంవత్సరం కుట్టించు కొన్న సూటు ధరించి వుద్యోగప్రయత్నం మీద వ్రాగివెంబడి బయలు దేరాడు. బెస్ట్ అండ్ కంపెనీ. పారీ అండ్ కంపెనీ మొదలైన పెద్దపెద్ద కంపెనీ లన్నిటికీ వెళ్ళాడు. ఏమీ లాభం

లేక పోయింది. ఆ దినం భోజనమయినా చెయ్యకుండా సాయింత్రం వరకూ ప్రయత్నించాడు. ఎక్కడ చూసినా గేటు వాచర్ల బుకాయింపులూ, No Vacancy బోర్డులూ తప్ప మరింకేమీ అతనికి అగుపించలేదు.

సాయింత్రానికి సత్రం చేరుకొన్నాడు. పరిశుభ్రంగా స్నానంచేసి, కొల్లాయిగుడ్డని తన గదిలో ఆరవేసాడు. తను తెచ్చుకొన్న ట్రంకు పెట్టె మీద కూచుని ఆలోచన ప్రారంభించాడు.

ఏమనా ?

తనకి ఈ జీవితంలో పది డబ్బులు సంపాయించుకొనే యోగ్యత వుందా, లేదా అని; సమస్య తెగలేదు. అలా ఆలోచిస్తూనే నేలమీదికి వరిగాడు. మానవలోకానికి జరిగే విపత్తుల్నీ, విచారాల్నీ, విషాద సంఘట్టనల్నీ, మరపింప జేస్తూ, ఓర్పుతోనూ జాలితోనూ లాలించి జోకొట్టే నిద్రాదేవత అతన్ని కూడా నిద్రపుచ్చించి. మర్నాటి భాను కిరణాలే అతన్ని మేలుకొల్పాయి.

లేచాడు. కాలకృత్యాలు తీర్చుకొన్నాడు. మళ్ళీ మామూలు ప్రయత్నం.

ఆ విధంగా పదిహేను రోజులు గడిచిన్నై. ఎక్కడా ఏ విధమైన నౌకరీ దొరకలేదు. జీవితం మీద విరక్తిపుట్టింది.

ఆత్మహత్య చేసుకొనేందుకు సాహసంలేదు; జీవించేందుకు సాధనంలేదు. నాలుగు మూడు రూపాయిలు తప్ప తక్కిన సొమ్మంతా ఖర్చయిపోయింది. అను క్షణమూ అతనికి షేక్సు పియర్ కవీంద్రుడు చెప్పిన All the world's a stage — And men and women mere players. అనే మాటలు జ్ఞప్తికివస్తూ వుండేవి.

*　　*　　*

ఒకనాటి వుదయం ఒక దృశ్యం అతని దృష్టులకి గోచరమయింది.

ఒక సందుగుండా ఎవరో కోమట్లబ్బాయి యిడ్డెన్ల పొట్లం ఒకటి చేతులో పుచ్చుకొని వెళ్తున్నాడు. ఆ అబ్బాయికి సుమారు పదేళ్లు వుంటాయి. ఒక శునకరాజం అతన్ని వెంబడించింది. "ఛీ, ఛీ," అని గదమాయించాడు, దాన్ని. అది వెనక్కి తిరగలేదు. కుర్రాడి వెంటనే వస్తోంది. ఇంకో తఫా గదమాయించాడు. అది తదేకనిష్ఠతో కుర్రాణ్ణి వెంబడించింది. కుర్రాడు కొద్దిగా భయభ్రాంతుడై కాళ్ళకి బుద్ధి చెప్పడం మొదలెట్టాడు. అదీ వానివెంట పరిగెట్టింది. అలిసిపోయి, కనిలా దాపురించిన ఆ కుక్కని, వదిలించుకోవడమెలాగా అని ఆ అబ్బాయి దిగులుపడి నుంచున్నాడు. అతని ముందుకివచ్చి కాళ్ళ దగ్గర తోక ఆడిస్తూ కుక్క

నుంచుంది. కుర్రాడికి గత్యంతరం తోచక పొట్లం విప్పి, ఒక యిడ్డెను తుంచి, చిన్న ముక్క దానిముందు పడేసి ప్రక్క సందులో నుంచి పారిపోయాడు.

ఆనంద బి. ఏ. కి ఆ దృశ్యం చూడగానే ఒక inspiration కల్గింది. అది రైటు అనుకొన్నాడు. One morning I woke up and found myself great అన్న మిల్టన్ వాక్యాలు అతని బుర్రలో ధగధగ మెరిసినై.

పది అయేటప్పటికి ఒక పెద్ద యింగ్లీషు కంపెనీమెయిన్ గేటు దగ్గిరికి పోయి నుంచున్నాడు. పదిన్నరకి ఆఫీసు ముందర వో కారు వచ్చి ఆగింది. అందులోనుంచి వో దొర పైపు నోట్లో యిరికిస్తూ దిగాడు.

అతనే ఆ కంపెనీ మేనేజరు అయి వుంటాడని తల పోస్తూ, ఆనందం "గుడ్‌మార్నింగ్ సార్" అని అన్నాడు.

అతనో సారి గౌరవసూచకంగా తలవంచీ వంచనట్లు వంచి లోపలికి పోయాడు.

వాళ్ళకి ఒంటిగంట లంచ్ టైము. ఒంటి గంటకి యివతలికి వచ్చాడు.

ఆనందం మళ్ళీ ప్రత్యక్షం. "గుడ్‌మార్నింగ్ సార్" అని అన్నాడు.

ఈ తఫా దొరగారు కార్లో కూచున్నతర్వాత 'ఎవరా ఈ స్టుపిడ్' అన్నట్లు ఆనందం మొహం వంక ఒకసారి చూసాడు.

రెండున్నరకి దొర ఆఫీసులోకి వెళ్తూ వుండగా ఆనందం మళ్ళీ "గుడ్ మార్నింగ్ సార్" అని అన్నాడు.

"ఏం కావాలి ?" దొర ప్రశ్నించాడు.

"వుద్యోగం ? ?"

"No Vacancy బోర్డు కళ్ళకి కనిపించడం లేదూ ? అని అంటూ దొర రివ్వున లోనికి పోయాడు.

సాయింత్రం అయిదింటికి దొర యివతలకి వచ్చేటప్పుడు ఆనందం "గుడ్ మార్నింగ్ సార్" అని అంటూ అగుపించగా దొర రుస రుస లాడుతూ కారు ఎక్కాడు.

మర్నాడు వుదయం పదిన్నరకి ఆనందం, "గుడ్ మార్నింగ్ సార్" అని అనగా, దొర, "నీకు జ్ఞానం లేదా?" అని కోపగించుకొన్నాడు.

ఆ సాయింత్రం, "గుడ్‌మార్నింగ్ సార్" అనిఆనందం అనేటప్పటికి, దొర, "రేపు నువ్వు ఈప్రాంతాల్లో అగుపిస్తే ఏంచేస్తానో చూసుకో!" అని అన్నాడు.

మరుసటి దినం పదిన్నరకి ఆనందం మామూలు పంథాలో, "గుడ్ మార్నింగ్ సార్" అని అనగా దొర

"స్టుపిడ్" అని పైకి తిట్టూ, తనలో తను These Indians are Fools అనుకొన్నాడు. ఆ సాయింత్రమే ఫ్యాన్ చేత ఆనందాన్ని ఫర్లాంగు దూరం వరకూ గెంటించాడు.

*　　　*　　　*

ఇక ఆనందం పరాభవ జీవితంలో ఆలంబనమేమీ లేదు. అతని ఆశలన్నియూ అడియాసలై పోయినై. కాయ కష్టములకోర్చి చదువుకొన్న చదువు ఏమి ప్రయోజనమో అతనికి పొడగట్టలేదు. ఆ దరిద్రనారాయణునికి జీవితము నిరర్థకంగా తోచింది. భవిష్యత్తు ఏమిటో గోచరించలేదు. ఆ మేధావి బుర్ర మంట గలసింది. ఉద్యోగం లేదు; వుద్యోగం వస్తుందనే నమ్మకం గానీ, ఆశగాని లేదు. మూడు రోజులు పిచ్చివాడిలా వూరంతా కలియదిరిగాడు. ఆనందానికి పరాభవమై వారం రోజులు గడిచిందో లేదో ఒక తెలుగు పత్రికలో ఈ క్రింది విధంగా వుంది:

"ప్రమాద మరణము"

ఎవరో పట్టభద్రుడొకడు ఒకానొక జమీందారుగారి కారుక్రింద ప్రమాద వశాత్తున పడి కర్మ వశమున మరణించాడు.

---

# సినిమాకి



పిల్లలు ఎలాటి అవకతవక ప్రశ్నలు వేసినా ఆ పిచ్చి ప్రశ్నలకి సరి అయిన సమాధానాలు పెద్దవారు చెప్పని పక్షంలో, పిల్లల జ్ఞానోదయానికి భంగం కలుగుతుందట. అలా నొక్కి వక్కాణించే వారందరి వద్దకూ మా సీతని ఒక్కసారి పంపిస్తే సరి!

ఆ పదేళ్ళ బాలకి, సీతకి, ఈ ప్రపంచం అంతా అయోమయమే! అన్నీ ????

అవును, క్వొశ్చన్ మార్కులే!

ఆమెకి అణువు మొదలు అండపిండవేదోండ బ్రహ్మాండం వరకూ అన్నీ సందేహాలే! అన్నీ సంశయాలే! అన్నీ క్వొశ్చన్ మార్కులే!

పూర్వం జనకమహారాజు సీతని శివధనస్సుని ఎక్కుపెట్ట గలిగిన రాముడికిచ్చి పెళ్ళి జేసాడట. అలాగే, మా సీతకి కూడా ఆమె సంశయపరంపరని నివృత్తి చెయ్యగల మహామహుడు భర్త అవుతే బావుండును!

ఆమె ప్రశ్నలవర్షం ఖాండవవనం దహిస్తున్నప్పుడు యింద్రుడు కురిపించిన రాళ్ళవానకి యిసుమంతయినా తీసిపోదు.

సీతకి తరుచూ సముద్రంలో కెరటాలు ఎందుకు రావాలనీ, సూర్యుడు మా మేడకి ముందు వైపుని వుదయించి వెనకవైపుని అస్తమించడానికి బదులు వెనకవైపునే వుదయించి ముందువైపునే ఎందుకు అస్తమించకూడదనీ, ఇంకా యిలోకి నీళ్ళు ఎలా వస్తాయనీ, అన్ని రకాల చాక్లెట్లలో ఏ రకం చాక్లెట్లు మంచివనీ మొదలుగాగల సంశయాలు కలుగుతూ వుంటాయి. ఆ లేత మెదడులో అన్ని ప్రశ్నప్రవాహాలకి తావు ఎక్కడ వుందో!

ఒక రోజు మధ్యాహ్నం కాబోలు నన్ను అడిగింది:- మామయ్యా, మా మేస్టరుగారు భూమి గుండ్రంగా వుందని చెప్పారు నిజమేనా?

నా గుండె లటుక్కుమంది. చెప్పినదేమో మేస్టరుగారు; నేర్చుకొన్నదేమో తను. మధ్యని నాకెందుకంటా ఈ తంటా?

"అవును."

"ఏమిటి అవును మామయ్యా?"

"ఈ భూమి గుండ్రంగానే వుంది."

"అదే, ఈ ప్రపంచం కోడిగుడ్డులా వుందంటావు కాదూ ? అన్నట్లు, మనం కోడిగుడ్లు తినవచ్చునా, మాఁమయ్యా !"

"మనం బ్రాహ్మలం. తినకూడదు. తప్పు !"

"అవుతే ప్లీడరుగారి అమ్మాయి మందు అని చెప్తూ రోజూ పొద్దున్నే కోడిగుడ్డురసం పుచ్చుకొంటుందేం ?"

"నీ కెందుకూ యింకోళ్ళ గొడవ ?"

"అవున్లే నా కెందుకు ?.........భూమి గుండ్రంగా వుందంటావు కాదూ?"

అంటూ మొదటికే వచ్చింది.

"ఊఁ" అన్నట్లు తల పంకించాను.

"మరి, భూమి తిరుగుతోందంటారు. నిజమేనా ?"

"ఊఁ"

"అవుతే, మనం తిరగమేం ?"

అక్కడితో పడింది బ్రేకు. భూమి తిరుగుతోందని మా మేష్టరుగారూ చెప్పారు, నా చిన్నప్పుడు. భూమి సూర్యుని చుట్టూ తిరగడమే కాకుండా తనలో తను తిరుగుతోందని కూడా చెప్పారు. మనమెందుకు తిరగమని మేమూ అడిగాం, మా మేష్టార్ని. తిరగమని నిష్కర్షగా, విస్పష్టంగా చెప్పింది వేద

మన్నట్లుగా, చెప్పాడు. మాలోవున్న బడుద్ధాయి ఒకడు ఎందుకు తిరగమని గట్టిగా అడిగితే ఒక్కచురక తగిలించాడు. దెబ్బతో మా సందేహాలన్నీ దేవేంద్రలోకంలోకి పోయినై. Two parallel straight lines will never meet అన్న axiom లా భూమి గుండ్రంగా వున్నదన్న విషయం కూడా ఒక axiom అని మేము నమ్మవలసి వచ్చింది. నా బుర్ర బద్దలు చేసుకొన్నా, ఈ గొడవ అంతా సీతకి అర్థమవుతుందా!

"ఏం, మామయ్యా, మాట్లాడవ్?"

"ఏమిటి?"

"భూమి తిరుగుతోంది కదా మనమెందుకు తిరగం?"

"తిరగం."

"ఏం."

"ఏమీ లేదు."

"ఎంచేత తిరగం?"

"ఏమీ లేదు."

"అదేమిటి మామయ్యా, మా మేష్టారూ అలాగే చెప్పారు, నువ్వూ అలాగే చెప్తున్నావ్?"

మనం ఎందుకు తిరగమో సీతకి నచ్చేటట్టు చెప్పడం సులభసాధ్యం కాదు.

అలా అంటే నవ్వుతున్నారా? సీతా నవ్వింది, ఫక్కున.

*    *    *

కిటికీ సందుల్లోనుంచి సూర్యరశ్మి నా టేబుల్ మీద కొద్దికొద్దిగా పడుతోంది. నా వళ్ళు పులక పెడుతోంది కాని, చాలా సీరియస్‌గా షెకవ్ కథల పుస్తకం చదువుతున్నాను.

ఎకాయెకిని సీత నా టేబుల్ మీదికి వచ్చి కూచుంది. నా వళ్లు మండింది.

"మామయ్యా, చెమట పోసేలా చదువుతున్నావేం ?"

అంటూ పరికిణీ కొంగుతో నా నుదుటి మీది స్వేద బిందువుల్ని తుడిచింది.

ఆ అసాధారణపు ఆదరణతో నాకు రావలసిన కోప మంతా మటుమాయమై పోయింది. చిన్న నవ్వు నవ్వాను.

"తర్వాత చదువుకోవచ్చులే, మామయ్యా !"

అంటూ నా చేతిలోని పుస్తకం తీసుకొని తన వళ్లో పెట్టుకొంది.

"సీతా, నేను చదువుకుంటూ వుంటే ఎందుకు పాడు చేసావ్ !"

అంటూ ఆ పదేళ్ళ బాలనీ నా వళ్లోకి లాక్కొని, రెండు బుగ్గలూ మృదువుగా నలిపాను.

'నా బుగ్గలన్నీ కంది పోతున్నాయి,' అని అంది, సీత రెండు చేతుల్తోనూ తన బుగ్గల్ని దాచుకొంది.

ఒక నిముషం అలా గడిచింది.

'సినీమాకి తీసుకు వెళ్తానన్నావ్! మర్చిపోయావేమిటి?'

'లేదు. మర్చిపోలేదు. ఇంకా టైమవలేదు.'

ఆ రోజున సీత పుట్టినపండుగ. అంచేత ఆమెని సినీమాకి తీసుకు వెళ్ళాలట!

ఎలాగయితేనేం, సినీమాకి వెళ్ళాం. హాలు జేరుకొనే టప్పటికి యింకా అయిదున్నర అయినా కాలేదు. బుకింగ్ ఆఫీసు అప్పటికి తెరవనే లేదు. రాబోయే ఫిల్ములోని ఫోటోలు చూస్తూ ఒక పావుగంట దాకా నుంచున్నాం. ఇంతలో బుకింగ్ తెరిచారు. పన్నెండేసి అణాలు వెచ్చించి రెండు టిక్కెట్లు కొన్నాను. హాలులో ప్రవేశించినాం.

బయట కొద్దికొద్దిగా చినుకులు పడుతున్నాయి. చల్లగాలి వీస్తోంది! సినీమాచుట్టూ వున్న పూలమొక్కలు కమ్మటి వాసనలు వెదజల్లుతున్నాయి.

అంత వరకూ హాలులోకి వచ్చిపోయే జనసమ్మర్దాన్ని పరికిస్తున్న సీత తన దృష్టుల్ని తలవని తలంపుగా పైభాగానికి ప్రసరింప జేసింది.

పంకా తిరగడంలేదు. ఎందుకు తిరక్కపోవాలి ???

వచ్చింది మీమాంస; ఇచ్చింది పంకా తిరగడం లేదన్న Information నాకు.

"చల్లగా గాలి వేస్తోంది కదా, సీతా, యింకా పంకా ఎందుకు ?"

అంటూ ఈ మామయ్య సీతని సమాధానపరచడానికి ప్రయత్నించాడు. సాధ్యమా ?

"మనం రూపాయిన్నర యిచ్చాం. పంకా ఎందుకు తిరక్కపోవాలీ ? ? ? మనం యిక్కడ కూచున్నంత సేపూ తిరగవలసిందే," అని ఆమె వితండవాదన.

దగ్గర్లో కూచున్న వారిలో తెలుగు వచ్చినవారు మా సీతాదేవి భావిభారతదేశానికి ఆదర్శ స్త్రీరత్నమవుతుందన్నట్లుగా ఆమె వంక పరకాయించి చూసి తమలో తాము ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు.

నేను గేటు వద్ద వున్న మనిషిని సమీపించి, పంకా వెయ్యమని ప్రార్థించాను.

"ఆరు అవనియ్యండి సార్"! అని అన్నాడు, ఆ అపరిచిత వ్యక్తి.

"నేను అయిదున్నరకే వచ్చిచ్చానే",

అతను వులిక్కిపడి నన్ను ఎగాదిగా చూసి పక్కని వున్న స్విచ్ నొక్కాడు. పంకా గిర్రుమంటూ తిరగడం మొదలెట్టింది. సీత మొహం చింపిచేటంత అయింది.

మొదటి బెల్ కొట్టారు. సీత పరిశోధనాభావంతో నలుదిక్కులూ చూసింది.

"ఏమిటి ?" అని ప్రశ్నించాను.

"చాక్ లెట్లు."

అంత వరకూ ఎక్కడ దాగాడోగాని అమాంత్రం ప్రత్యక్షమయాడు చాక్ లెట్ల కుర్రాడొకడు.

"తీసుకో, అమ్మా !"

అంటూ ఆ కుర్రాడు పళ్ళాన్ని సీత ముందు పెట్టాడు.

రకానికి మూడు చొప్పున సీత తీసుకొంది. పన్నికాల్ రూపాయి తీసుకు పోయాడా చాక్ లెట్ల వెధవ.

"అన్ని తీసుకొన్నావేం !" అని అన్నాను, సీతతో.

"తీసుకుంటున్నప్పుడు వద్దనక పోయావ్రా ! కాగితం విప్పేసాను కూడాను."

"............."

"ఆ కుర్రాడు తీసుకుంటాడేమో! పిల్చి, కొన్ని యిచ్చేసెయ్యి."

అంటూ నా వంక వోరకంట చూసింది.

నాలో నేను నవ్వుకొన్నాను. ఆమె యిచ్చేదీలేదు; వాడు తీసుకొనేదీ లేదు.

సినీమా మొదలెట్టారు. సీతకి దాహమయింది.

విమ్‌టో కావాలంది. నోటిదగ్గిర పెట్టుకొని బావుండ లేదని తోసేసింది.

టీ కావాలంది. టీలో పంచదార తక్కువయింది. రుచిగా లేదు కనక తాగలేనంది.

మంచినీళ్ళు కావాలంది. సోడా అమ్మే కుర్రాడ్ని బతిమాలి, వాడికి ఒక అర్ధణా దక్షిణ యిచ్చి, మంచినీళ్ళు తెచ్చిపెట్టమన్నాను. మంచినీళ్ళు తాగింది.

ఆమెకి సినీమా అంతా ఏమిటోలా వుంది.

శాంతా ఆప్టే ఒక పాట పాడుతోంది. గాన ప్రతిభ అంతా ఆ పాటలో వృష్టి పడుతోంది. ఆమె కంఠమాధుర్యం ప్రేక్షకుల్ని తన్మయులయేటట్టు చేస్తోంది. ప్రతి వ్యక్తీ ఆ పాట వీనులార విని ఆనందిస్తున్న సమయంలో సీత, "మామయ్యా, వంటేలుకి వెళ్ళాలి, సాయం రావూ?" అని అడిగింది.

నాకు ఆగ్రహం వచ్చింది. ఒక్క మొట్టికాయ పెడ్దా మనుకొన్నాను. కసురుకుంటూ తీసుకువెళ్ళాను. తప్పుతుందా?

ఇంటర్ వెల్.

మళ్లీ చాక్ లెట్ల కుర్రాడు నవ్వుతూ మా దగ్గిరికి వచ్చాడు. సీత స్వభావం పసిగట్టాడు కాబోలు !

"ఈ తఫా నువ్వే కొను మామయ్యా !" అని అంది సీత, చిరునవ్వు పెదవులమీద తొలు కాడుతూ వుండగా.

నేను తెల్లబోయి, "అన్ని చాక్ లెట్లూ తినేసావా ?" అని అడిగాను.

"ఊఁ" అన్నట్లు ఆమె తల వూపింది.

"ఇంక చాక్ లెట్లు వద్దు. జబ్బు చేస్తుంది."

"చాక్ లెట్లు జబ్బు చెయ్యవ్. బలమని చెప్పలేదూ, మన డాక్టరుగారు ?"

"అయినా, వద్దు."

"ఇవ్వాళ నా పుట్టిన పండగ కాదూ, మామయ్యా?"

"అవుతే ?"

"నేను తినగలిగినన్ని చాక్ లెట్లు నువ్వు కొనాలి."

కొననని నిష్కర్షగా చెప్పాను. రెండు నిముషాలు గడిచినై.

"మామయ్యా, నాకు ఒక పావలాబదులు యిస్తావా? ఇంటికి వెళ్ళిన తర్వాత అమ్మని అడిగి యిచ్చేస్తాను."

"ఎందుకు ?"

"కావాలి."

"ఎందుకో చెప్పు."

"ఇస్తానంటే చెప్తాను."

"ఇస్తాను, చెప్పు."

"చాక్లెట్లు కొనుక్కోవాలి."

నాకు నవ్వూ కోపమూ ఒక్కసారి వచ్చినై. ఇంకో పావలా తగలేసి చాక్లెట్లు కొని సీతకి యిచ్చాను.

మళ్ళీ సినీమా మొదలెట్టారు. ప్రకటనలు చూపిస్తున్నారు.

అమృతాంజనం ప్రకటన చూసి, సీతఅడిగిందదేమిటని.

ఫలానా అన్నాను.

"ఈ సినీమా నేను చూడలేను. నాకు తలకాయ నొప్పి వస్తోంది, మామయ్యా."

"ఇలా పడుకో,"

అంటూ, తొడ మీద తల పెట్టుకొని పడుకో మన్నాను.

"నేను అలా పడుకోను. ఇంటికి పోదాం."

"సినీమా అయిపోయిన తర్వాత పోదాం. అంత దాకా యిలా పడుకో."

"కాదు. ఇప్పుడే పోవాలి. నాకు తల భారంగా వుంది."

"నీ మొహం."

"నాకు తల పోటుగా వుంది."

"నీ తలకాయ."

"అవును, నాతలకాయే నొప్పిగావుంది. ఇంటికిపోయి, అమృతాంజనం రాసుకోవాలి."

సీత ఎంత చెప్పినా వినలేదు. ప్రకటనలు చూపించక పూర్వమే యింటికి ప్రయాణం కట్టింది.

"సినీమా పూర్తిగా చూడకుండా వెళ్ళడ మేమిటి ?" అని అన్నాను, నాకు బయలుదేరడం యిష్టంలేక.

"ఎందుకు పూర్తిగా చూడాలి ?"

? ? ? ?

చెప్పండి బాబూ ఎందుకు చూడాలో ! ! !

* * *

ఇంటికి వస్తూ వస్తూ సీతని అడిగాను, సినీమా ఎలా వుందని.

సినీమాకంటె చాక్లెట్లే బావున్నాయంది.

# జ య రా ం



అతను, - అంటే ఆరేళ్ళ పూర్వం ప్రాణస్నేహితుడు,- వస్తున్నాడని తెలిసి స్టేషనికి వెళ్ళాను. ఎంతో ఆదరణతో ఆ పాతస్నేహితుడ్ని ఆహ్వానించేందుకు వెళ్ళాను.

రైలూ ఆగింది, అతనూ దిగాడు.

అతనిలో వున్న మార్పుకి నేను తెల్లబోయాను. గత రాత్రి మా పూర్వపు సంఘటనల్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నప్పుడు కూడా అతనలా - అంత భీకరంగా - వుంటాడని అనుకోలేదు. అతని వాలకంలోనూ, అతని చేష్టల్లోనూ వున్న మార్పుని రెండు మూడు తడవాలు నిదానంగా గమనించి నేను అవ్వాళ్ళో వున్నట్లు అతనికి తెలీకపోతేనే బావుండేదేమో అనుకొన్నాను.

పూర్వం, అంటే ఆరేళ్ళకి పూర్వం, జయరాం నయనాల్లో నుంచి కరుణా, కవితానందమూ ప్రసరిస్తూ వుండేవి. కాని, ఈనాడతని నేత్రద్వయం అతి భీకరంగా వుంది. ఆ కళ్ళల్లో సమస్త జీవకోటినీ తన అదుపాజ్ఞల్లో వుంచుకొందామనే తృష్ణ ఒకటి గోచరిస్తూ వుంది. ఆరేళ్ళకి పూర్వం అతని సుందర వదనారవిందం వైపు యింకోసారి కన్నెత్తి చూదా

మని వాంఛించని కాంతామణి లేదు. ఈనాడు వికృత వికట విషాదాల్తో కూడిన అతని మోమును ఆప్యాయంతో వీక్షించ గానికి సాహసించగల్గే తలోదరి వుండదు. ఈనాడతను తన భౌతిక దేహానికీ, ఆత్మకీ మధ్య ఏర్పడిన భేదం తెలుసుకొందా మని తహతహ లాడిపోతున్న ఒక వింత మానసి, ప్రకృతి బాహ్యము లయిన కొన్ని శక్తులు సంపాయించిన ఒకానొక విడ్డూరపు మనిషి.

అతని రెండు చేతులూ ఎప్పుడూ పంట్లాం జేబుల్లోనే వుంటాయి. బయటికి తియ్యడు. ఒకవేళ అవసరంవచ్చి తీసినా వుత్తరక్షణంలో అవి వాటి స్వస్థానాన్ని ఆక్రమిస్తాయి. అతను తన చేతులంటే తనే అమితంగా భయపడతాడు. వాటిని తన ప్రాణాల మాదిరి చూసుకుంటాడు. మన మందరమూ చేతులు వూపుకుంటూ నడిచినట్లు అతనెప్పుడూ నడవడు. నడిస్తే, చేతులు రెండూ కిందపడిపోతాయనే భయమేమో!!

అతను భోంచెయ్యడు. పళ్ళుమాత్రం తీసుకుంటాడు. అవి అయినా పరాయి మనిషి ఎదురుగా వుంటే తీసుకోడు. నాలుగు తలుపులూ బిడాయించి రహస్యంగా భుజిస్తాడు!! అలాటి వింత అలవాట్లు అతను ఎందుకు అభ్యాసం చేసుకొన్నాడో!!!

వచ్చిన నాటి రాత్రి పదకొండు గంటల దాకా గాలి కబుర్లు చెప్పుకుంటున్నాం. రెండు చేతులూ పంట్లాం జేబుల్లో యిరికించి అతను నేను వేసే ప్రతి ప్రశ్నకీ నవ్వుతూ జవాబు యిస్తున్నాడు. మధ్యాహ్నం నుంచీ నాకు అతని స్వభావాన్నీ, చేష్టల్నీ గమనించడంతోనే సరిపోయింది.

హాల్లోని గడియారం పదకొండూ కొట్టి అప్పటికి అయిదు నిముషాలు అవుతుంది. అతని నవ్వు మాయ మయింది. మోహంలో విపరీతమయిన సీరియస్ నెస్ గోచర మయింది.

చంద్రుడ్ని ఒక మేఘపంక్తి మరుగుచేసింది. పవనుడు వుత్సాహంతో గంతులు వెయ్యడం మొదలెట్టాడు. చిరుతుం పరలు పడినై. మరికొంత సేపటిలో కారుమేఘాలు ఆకాశ మండలాన్ని కమ్మినై. రివ్వుమంటూ గాలి. పది నిముషాల్లో భీకరమయిన గాలి. సముద్రం పొంగి మా మేడని కబళిస్తుందా అన్నంత తుపానుగాలి.

"తుపానుగాలి మాదిరి వుంది," అని అన్నాను.

అతను నిమీలిత నేత్రుడై ఆలోచిస్తున్నాడు. గ్లాస్ కిటికీల్లో నుంచి పిచ్చివాడిలా ఆ కాళరాత్రిని పరిశీలిస్తున్నాడు. ఆవల ఆవరణలో వున్న తోటలోని చెట్లు - చలికి మనం వణికి

పోయేటట్లు - వణికి పోతున్నాయి. తలవని తలంపుగా జాకీ (కుక్క) బౌ బౌ అంటూ నా దగ్గిరికి వచ్చి యింకా నిద్ర పోలేదా ? అని కుశలప్రశ్నలు అడుగుతున్నట్లు అరవసాగింది.

"ఇక, నేనుపోయి పడుకుంటాను," అని అన్నాను, జయరాంతో.

జయరాం నన్ను కూచోమని బలవంత పెడుతూ, నా భుజం పట్టుకొని కూచోపెట్టాడు. జాకీని అరవవద్దని కూకలేసాను.

నేను:—నిద్రవస్తోంది, నన్ను పోనీ.

జయరాం:—ఇది తుపానుగాలి కాదూ ?

నేను:—అవును.

జయరాం:—తుపాను నా నరాల్ని బాధిస్తుంది.

నేను:—అవును, తలభారం చేస్తుంది.

జయరాం:—నాకు తల నొప్పిరాదు కాని, భయం వేస్తుంది.

జయరాం లాటి ఆజానుబాహుడు గాలి అంటే తనకి భయం వేస్తుందని అనగా నాకు ఒక్క పెట్టున నవ్వువచ్చింది. నవ్వాను.

అన్యాయం

జయరాం:—నవ్వకు. నీకు తెలీదు. నిన్ను బతిమాలుకుంటాను. ప్రాధేయపడ్తాను. నన్ను వదలిపెట్టి వెళ్ళకు.

నేను:—నీకేమయినా పిచ్చి పట్టిందా ?

జయరాం:—అవును. అప్పుడప్పుడు, ముఖ్యంగా యిలాంటి తుపానుగాలి వచ్చేటప్పుడు, నాకు పిచ్చెత్తుతూ వుంటుంది. ఇది...యిది...యిది...ఈ రాత్రి...ఎలాటి రాత్రో తెలుసా?...ఎలక్ట్రిక్ రాత్రి...నేనంటే నాకే భయం వేస్తూ వుంటుంది ..నీ కర్థమవుతోందా ?...అవదు. అవదు. ఇంకా చెప్తాను...నాలో ఒక మనశ్శక్తి వుంది,...కాదు ఒక ఫోర్సు. ఏమో, దాన్నేమనాలో నాకే తెలీడం లేదు.... నాలో, సాధారణ మానవుల్లో లేని ఒక మాగ్నటిక్ శక్తి వుంది. దానికోసమే నేను భయపడుతూ వుంటాను. నేనంటే నాకే భయం వేస్తూ వుంటుంది.

అతన్ని ఏ రకమయిన భయం బాధిస్తోందో నాకు అర్థమవలేదు. కాని, నా వళ్ళుమాత్రం అతని మాటలూ, చెప్పిన శక్తీ, గమనించగానే కంపర మెత్తింది. ముచ్చెమటలూ పోసినై. అక్కడ్నుంచి, అతని దృష్టిపథంలోనుంచే, పరిగెత్తి పారిపోవాలని బుద్ధి పుట్టింది. కాని, అసమర్థుడ్ని అయిపోయాను. అతని భీకరనేత్ర ద్వయం నన్ను పరిశీలించినప్పుడల్లా నా సర్వావయవాలూ కంపించిపోయేవి.

"నువ్వు నాతో ఈ విషయం ఎప్పుడూ చూచాయగా అయినా ప్రస్తావించలేదే!" అని అన్నాను. ఏమీ మాట్లాడక పోతే అతను తంతాడేమో అన్నంత భయపడుతూ.

అతను నా మాటలు వినిపించుకోలేదు. పరధ్యానంగా వున్నాడు.

"అవును. యింతవరకూ నే నెవరికీ చెప్పనవసరం లేక పోయింది. కాని, ఈ రాత్రి మాత్రం ఏదో కారణంచేత నా హృదయంలో నుంచి ఏమిటో అవేశం వుబుక్కు వస్తోంది. ఇక దాచలేను. చెప్తాను, విను...ఈ ప్రపంచంలో మాగ్న టిజమ్ అనేది ఒకటివుంది... తెలుసా ?... తెలిసేవుంటుంది... ఈనాడు పేపర్లలో కూడా అనేక ప్రకటనలు కనిపిస్తూ వుంటాయి. అది ఏమిటో ఎవరికీ తెలీదు. కాని ప్రతివారికీ అలాటిది ఒకటి వుందని తెలుసు.

"ఒక మానవుడు, - సాధారణ మానవుడు, - యింకో మానవుణ్ని తన శక్తివల్ల నిద్రపుచ్చగలడు. ఎలాగో గ్రహిం చగలవా ? సంకల్పములోని దారుఢ్యతని కోల్పోయేటట్టు చేస్తాడు. మూర్ మార్కెట్టు పరిసరప్రాంతాల్లో పరాకుగా వుంటే జేబుదొంగ పర్సుకొట్టేస్తాడు. అలాగే, మాగ్నటిజమ్ తెలిసిన వ్యక్తి చిత్తము దొంగిలిస్తాడు. సంకల్పాన్ని పోగొట్టు కున్న వ్యక్తి, మాగ్నటిజమ్ తెలిసినవ్యక్తి ఏలాంనడవమంటే

అలా నడుస్తాడు. ఒక్కసారి ఆలోచించు; ఆ శక్తిగల వ్యక్తి పతివ్రతాలలామ తనకె ప్రేమలేఖలు వ్రాసేటట్టు చెయ్యగలడు. లక్షాధికారి తనముందు కీలుబొమ్మలా నాట్యమాడేటట్లు చెయ్యగలడు. సర్వశక్తుల్నీ తనశక్తిలో యిముడించుకోవాలని ప్రయత్నిస్తాడు. అలాంటి అఘోరమయిన శక్తి ఎంత భయానకమో ఆలోచించు.

"ఇదంతా నిజం. ఎందుకు యిలా జరుగుతోంది? నీకు తెలుసా? నాకు తెలుసా? ఎవరికయినా తెలుసా? ఈ విషయం తెలిసిన వ్యక్తి ఒక్కడు కూడా ఈ ప్రపంచకంలో లేకపోతే, మరింక ఈ ప్రపంచమెందుకు??

"చూడు. ప్రపంచమంతా ఒక మర్మం. మన శక్తులన్నీ అసంపూర్తి అయినవి. మన టెలీఫోన్లలోనూ, స్టీమర్లలోనూ, విమానాల్లోనూ, ఒకటేమిటి, నాగరిక యంత్రా లన్నిటిలోనూ, అసంపూర్ణత చక్కగా కనపడుతోంది... ఇదంతా ఒక మర్మం. చూడు, గానము...గానము రాళ్ళని కూడా కరిగిస్తుందని మనం ఎంతో కాలంనుంచి వింటున్నాం. అది ఒక దేవతాకళ. ఆత్మానందాన్ని కలిగించే వృత్తమోత్తమ కళ. మనస్సుని ఆనంద సాంద్రంలో వూగులాడించే జ్యోతిర్మయ. అలాంటి గానాన్ని మనం ఎలా ఆనందించ కలుగుతున్నాం? కర్ణేంద్రియమనేది ఒకటి వుండడంచేతనే!! కర్ణేం

ప్రియమనేది లేకపోతే గానామృత మనేదాన్ని అనుభవించ డానికి తావుంటుందా? మనం వూహించడానికి వీలు అయినా వుందా? లేదు. ముమ్మాటికీ లేదు. ఈ అనంతమయిన ప్రకృతిలో అనేక శక్తులు యిమిడి వున్నాయి. ఆ శక్తులన్నిటినీ అర్థం చేసుకోగలిగే యింద్రియాలు మనలో లేవు...అలాటి వాటిలో మాగ్నటిజమ్ ఒకటి.

"వాయువు!! గాలి అనేది ఈ ప్రపంచంలో వుందని అందరూ వప్పుకోవాలి. మన నేత్రాలకి వాయువుని చూడ కలిగే శక్తి వుందా? లేదు...అంచేత, గాలి అనేది ఈ ప్రపంచకంలోనే లేదని అనగలమా!!! ..అలాగే మాగ్నటిజమ్.

"నాలో...నాలో...అవును...నాలోనే...ఒక దారుణమయిన శక్తి వుంది. తలుచుకొన్నప్పుడల్లా నా గుండె బద్దలయిపోతుంది. నాలో యింకో 'నేను' వున్నట్లు గోచరిస్తుంది. లోపల వున్న ఆ 'నేను' ఎప్పుడూ, సర్వకాల సర్వావస్థల యందూ బయటికి పోవాలనే వాంఛిస్తూ వుంటుంది. పోవాలని గింజుకుంటుంది కూడాను. అంచేతనే ఈప్రపంచకంలో అసంతృప్తి వుందని నా అభిప్రాయం. ఒక దేహంలో - ఒక చిన్ని దేహంలో - రెండు పోరాడే వ్యక్తులు, ఒక వొరలో రెండు కత్తులు. ఎంత అసౌఖ్యమో ఆలోచించు.

"నువ్వు మాట్లాడకు. ఏదో జవాబు చెప్పాలని ప్రయత్నిస్తున్నావ్! నువ్వేమీ జవాబు చెప్పనవసరం లేదు.

నాకేమీ పిచ్చి పట్టలేదు. భయపడకు. నేను చెప్పేదంతా పూర్తిగా విను.

"నేను మానవులవంక చూసానంటే వారికి నల్లమందు మాత్రలు యిచ్చేందుకు చూస్తున్నానన్నమాట. వాళ్ళల్లో వుండే సంకల్పాన్ని నాశనం చేసి వాళ్ళందర్నీ వశం చేసు కొందామనే నా వాంఛితం. తీక్షణదృక్కుల్తో నేను ఎవరి నయినా పరికించానంటే అంతే!!

"నా చేతులు...దిక్కుమాలిన చేతులు...దారుణ మయిన చేతులు బయటికి తీసానంటే... తెలుసా ?... తెలుసా ?...ఏమవుతుందో !!...నా శక్తి మనుష్యుల మీదనూ, జంతువులమీదనూ ప్రసరిస్తుంది. హాయిగా, ప్రాణం లేని వస్తువులుకూడా నాఆజ్ఞకి పాడులుతూ వుంటాయి...

"ఈ భయానకమయిన నా శక్తి తలుచుకొన్నప్పుడల్లా నాకు భయం వేస్తుంది. గుండె దడ దడ లాడుతుంది. భీభత్సుడ్ని అవుతాను. ఎన్నోసార్లు నా కళ్లు రెండూ పీకేసు కొందామనీ, నా హస్తాలు రెండూ నరికేసుకొందామనీ అనుకొన్నాను ; కాని, నా వశమా ?"

నేను ఒక పెద్ద నిట్టూర్పు విడిచాను, అతను మళ్ళీ మొదలెట్టాడు.

"చూడు...ఆ మూలనివున్న కుర్చీ మన దగ్గిరికి ఎలా నడిచి వస్తుందో!!"

నేను హడిలి పోయాను. కాళ్లూ చేతులూ వణికినై. అతను వాడిఅయిన కత్తుల్లాంటి తన రెండు చేతుల్నీ పంట్లాం జేబుల్లోనుంచి బయటికి తీసాడు. కుర్చీవైపు ఫోకస్ చేసాడు. కుర్చీ ఎవరో వెనకనుంచి తోసుకువస్తున్నట్లు మావద్దకివచ్చింది.

"ఇలా చూడు. ఈప్రపంచంలోని సమస్త ప్రాణి కోటులూ ఈ కుర్చీలాగానే నా వద్దకి వచ్చేస్తాయి. గ్లాస్ కిటికి వంకచూడు. అది నాతీక్షణదృష్టులకి ఫెళ్ళున బద్దలవుతుంది."

"వద్దు. వద్దు. ఇక చాలు. నాకు నిద్రవస్తోంది. నేను పోయి పడుకుంటాను." అని అన్నాను.

"పోతావా?" అని అంటూ అతను నావంక చూసాడు.

అబ్బబ్బ!! ఆ కళ్ళు, ఎర్రటి చింత నిప్పులు వెళ్ల గక్కుతూ ఆజ్ఞని శిరసావహించమని ఆత్మని అరికట్టగల్గే కళ్లు, చూసి బెంబేలు పడిపోయాను.

"పోను," అని అన్నాను. అతను దృష్టుల్ని కిటికీవైపుకి తిప్పాడు. గ్లాసు ఫెళ్ళున బద్దలయింది.

"చూస్తున్నావా? అదీ కారణం. అంచేతనే నా చేతులు ఎప్పుడూ దాచుకుంటాను. మాగ్నటిజమ్...ఎలక్ట్రిసిటీ...అవే. ఆకర్షణశక్తీ, విద్యుచ్ఛక్తి!

"ఈ శక్తిని దారుణమయిన దిక్కుమాలిన శక్తి అని ఎందుకు అన్నానో తెలుసా? నేను ఒక్కడ్నీ వున్నప్పుడు నా పని నాచుట్టూవున్న వస్తువుల్ని ఆకర్షించడమే? అది ఎంత చీకాకయిన పనో నువ్వే గ్రహించుకోగలవు - ఈ భయానక శక్తి నాలో వుందో మాయమయిందో పరీక్ష చేసుకొనేందుకు దినమల్లా నా చుట్టూ వుండే వస్తువుల స్థలాలు మారుస్తూ వుంటాను. అబ్బ! అబ్బబ్బ!!"

అతని చేతులు, అద్వితీయమూ దారుణమూ అయిన అతని చేతులు, పంట్లాం జేబుల్లోకి పోయినై.

వర్షం హోరున పడడం మొదలెట్టింది.

"ఘోరమయిన శక్తి," అని అన్నాను, నేను.

"ఘోరమా!! ఈ ద్వంద్వజీవనం కంటె మరణం మేలు," అని అన్నాడతను.

మర్నాటి మధ్యాహ్నమే అతను బొంబయి వెళ్ళిపోయాడు.

* * *

ఇది ఆరేళ్ళకి పూర్వం జరిగిన విషయం. ఈ నాడతను ఎక్కడ వున్నాడో నాకూ తెలీదు. బహుశా పిచ్చివాడయి తిరుగుతూ వుంటాడు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 101 B 152 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4, CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | thasin |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |